మానవాదర్శ గ్రంథమండలి.

౧౧ వ పుష్పము.

# తెలుఁగుసీమ.



దుగ్గిరాల బలరామకృష్ణయ్య.

ప్రకాశకులు:
తిపిర్నేని లక్ష్మీనారాయణ,
వ్యవస్థాపకుఁడు:
మానవాదర్శగ్రంథమండలి,
అంగలూరు, కృష్ణాజిల్లా.

వెల ౦-౪-౦

ముద్రాపకులు:
క. కోదండరామయ్యగారు,
ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల,
బెజవాడ.

# విజ్ఞప్తి



గాంధిగీతకుఁ బిదప నాంధ్రలోకమునకీ చిన్ని కావ్యమును ఇంత శీఘ్రముగ సమర్పించుకొనఁగలిగినందులకు జగదీశ్వరునకుఁ బ్రణతులు. ఈ చిన్ని కావ్యమందు ఒకటి రెండు తావుల ద్రుతమునకుఁ బిదప వచ్చు క, చ, ట, త, ప లు వ్యాకరణము ననుసరించి గ, జ, డ, ద, బ లు కావలసియున్నను యథారూపముగనే యుంచఁబడినవి. చెవికి వినుట కింపుగ నుండుటకొఱకును, అర్థ విస్పష్టత కొఱకును రచయిత యిట్లు సవరణలేకయే ముద్రింపించఁగోరిరి.

దీనిని శ్రద్ధతో విని అవసరమగు సవరణచేసి మాకుఁ దోడ్పడిన సుప్రసిద్ధకవిపుంగవు లగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారికి మా వందన శతంబులు. మా మండలిని నేఁటివఱకుఁ బోషించుచు వచ్చుచున్న ఆంధ్రమహాశయులకుఁ గృతజ్ఞులము.

అచిరకాలముననే మా సంపాదకుని పూర్ణ సహకారమునను, పరమేశ్వరుని కరుణావిశేషమునను నూతనకావ్యకుసుమములు మామండలినుండి వెలువడి ఆంధ్రభాషామతల్లి పాదపూజకు సమర్పింపఁబడఁగలవని ఆశించుచున్నాము.

మానవాదర్శగ్రంథమండలి,
కార్యస్థానము, అంగలూరు.
ది 28-10-32.

సుజనవిధేయుఁడు,
తిపిర్నేని లక్ష్మీనారాయణ,
వ్యవస్థాపకుఁడు.



# అంకితము

దేశసేవానిరతులును,

నిరాడంబరజీవులును,

అస్మదీయశ్రేయోభిలాషులును నగు

శ్రీ శ్రీ

## గొల్లపూడి సీతారామశాస్త్రి

గారికి.

# తెలుఁగుసీమ.



దిక్కు లన్నియుఁ । దెలిసి పాడఁగఁ
కీర్తికాంతులఁ । గెరలి యాడిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨ కత్తివ్రేటులఁ । గలముపోటుల
నారితేరిన । వీరభద్రుల
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౩ కాకతీయుల । కదనపాండితి
విచ్చి మండిన । వీరభూమిని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౪ కృష్ణరాణ్మణి । యుష్ణరక్తము
వీరరసమయి । వెల్లివిరిసిన
వీరభూమిని । తెలుఁగుసీమను
జగతిఁజాటర తమ్ముఁడా!

౫ కృష్ణరాయల । కీర్తిలతికలు
తీఁగబారిన । దివ్యపథమును
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬ రామరాయల । రాజ్యవైభవ
మతులశోభల । నలరియుండిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౭ తెలుఁగుజోదులు । తీవరించుచుఁ
బదనుకత్తులఁ । బగఱఁ దునిమిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౮ తలలుపోయిన । మొలలుపోయినఁ
గదనభూమిని । బోదలుబంటుల
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯ పిఱికికండల । నెఱిఁగియుండని
గండుశూరుల । నిండుతేజుల
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦ కంఠనాళముఁ । గఱకుకత్తుల
నుత్తరించిన । బిత్తరించని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౧ ప్రాణ మొడ్డుచుఁ । బరువు నిలుపఁగఁ
గత్తిఁబట్టిన । కమ్మవీరుల
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౨ రెడ్డిరాజుల । దొడ్డపౌరుష
జ్వాల రవిలిన । జ్వలనకుండముఁ
దెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౩ రెడ్డియోధుల । గడ్డుఁదీరిన
ప్రథననైపుణి । ప్రజ్వరిల్లిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౪ వెలమశూరుల । విపులవిక్రమ
తేజ మెగయుచు । దిశలఁ గ్రమ్మిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౫ బలిజవీరుల । భండనోద్ధత
చండశూరత । సార మెఱిఁగిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౧౬ ఆంధ్రపౌరుష । మరుల గుండెలు
వ్రయ్యఁ జెలఁగిన । రక్తసిక్తను
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౧౭ రాచవారల । రక్తదాహము
తీర నెత్తురుఁ । బారఁజేసిన
తెలివిగడ్డను । తెలుఁగు సీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౧౮ ఆంధ్రగజపతు । లదురు బెదరును
లేకపోరిన । నాకభూమిని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౧౯ వత్సవాయులు । ఉత్సహించుచు
శత్రుసేనలఁ । జమరి చీల్చిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

సీమ]

౨౦ తుళ్ళిపొంగెడి । తుంగభద్రను
అరులనెత్తురు । వరదఁజేర్చిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౧ కమ్మప్రభువుల । కాపుజోదుల
రెడ్డిరాజుల । దొడ్డతల్లిని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౨ ఓరుగంటను । నుతిమించూచుచు
వీరహృదయులఁ । బారఁద్రోలిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౩ చేవఁదీరిన । జీవగడ్డయి
చీకునెఱుఁగని । జీవగఱ్ఱగు
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౪ ధర్మవీర ప్ర । తాపరుద్రుని
రాజ్యపూజ్యత । రమణఁ గాంచిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౫ ఏకశిలపురిఁ । బ్రాకటంబగు
ప్రాభవంబునఁ । బ్రణుతు లందిన
తెలివిగడ్డను । తెలుఁగు సీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౬ కటకభూపతి । కండకావర
మణఁచి వెలిఁగిన । యాంధ్రవీరుల
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౭ భువి యుగంధర । భూరిధీయుత
మంత్రిసింహుని । మాతృదేవత
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౮ ఖడ్గతిక్కన । గండుమగఁటిమిఁ
గత్తివ్రేటులఁ । గసరి పోరిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౯ రాణిరుద్రమ । రమణమీఱఁగ
రాజ్య మేలిన । రమ్యభూమిని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౦ కొండవీటిని । గండుపులు లయి
రెడ్డిబంటులు । రేగి పోరిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౧ పుడమిఁ గారెమ । పూడిరణమున
పోరుసలిపిన । వీరబాలుని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౨ నాగమాంబిక । నాగుబా మయి
బుసలుకొట్టుచుఁ । బోరునందునఁ
దీవరించిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౩ భండనంబునఁ । బారిమెఱుఁగని
బ్రహ్మనాయని । బల్లెమాడిన
తీవ్రతరమగు ♦ తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౪ గండికోటను । కమ్మయోధులు
కావ నెత్తురు । గార్చుఁదడిసిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౫ రావువంశపు । రక్తదాహాలు
వీరమదమున । విఱ్ఱవీగిన
ధీరభూమిని । తెలుఁగు సీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౬ తాండ్రపాపయ । తీండ్రవెట్టుచు
ఘనత బెబ్బులి । యనఁగఁ జెలఁగిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౭ బొబ్బిలిం గడు । బొబ్బరించిన
తాండ్రపాపయ । తల్లిభూమిని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౮ కాంచినంతనె । కన్ను చెదరెడి
రంగరాయని । రక్తకవచము
తేజరిల్లిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౩౯ రావువేంగళ । రాయసింగము
చెలఁగి గర్జన । చేసి పోరిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

సీమ]

౪౦ పద్మనాయక । పౌరుషాత్ములు
వీరశత్రుల । పీచ మణఁచిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౪౧ వీరమాతగ । వెలుఁగునింపిన
మల్లమాంబకు । మాతృదేవిని
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౪౨ తిమ్మరుసురణ । ధీరనీతుల
రంగభూమిగఁ । బ్రణుతికెక్కిన
తెలివి తేటల । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౪౩ వీరరసములు । వెల్లివిరియఁగ
విచ్చుకత్తుల । వెలిఁగి మండిన
ధీరమాతల । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౪౪ రౌద్రరస మిల । రక్తరూపముఁ
దాల్చి రణమున । నిల్చి పోరిన
నెలఁతమిన్నను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౪౫ అనుమకొండను । అరులగుండెలఁ
జీల్చి నెత్తుటఁ । జెలఁగియాడిన
తెలుఁగురాజుల । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౪౬ తమిళభూమికిఁ । దరలి యచటను
బాహుదర్పము । ప్రజ్వరిల్లఁగ
వెలుఁగుధీరుల । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౪౭ వలసపోయిన । ప్రాంతమందును
గత్తిఁబట్టుచు । ఘనతవడయుచు
జెలఁగువీరుల । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౪౮ కలము హలమును । గరమునం గొని
కత్తిసాములఁ । గలముగీటుల
నలిగిపోరెడి । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౪౯ వేంగిరాజ్యము । నింగిముట్టిన
వైభవోన్నతి । వఱలియుండిన
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

సీమ]

౫౦ నింగినంటుచుఁ । బొంగి యెగిరిన
తెలుఁగురాజుల । వెలుఁగుబావుట
తలనువంచని । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౫౧ గండికోటయుఁ । గొండవీడును
కలిమి బలిమియుఁ । దెలుపఁ బొంగెడి
తెలివిగడ్డను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౫౨ చెలఁగు రాయల । సీమయందలి
బురుజులన్నియుఁ । బూర్వగరిమను
దలఁచి పాడెడి । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౫౩ కూలిపోయిన । కోటగోడలు
రాలిపోయిన । రాజ్యసంపద
దిబ్బవైచిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౫౪ చెక్కుచెదరని । చెన్నుఁగలిగిన
వివిధమందిర । విలసితంబగు
దివ్యపదమును । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౧ మాన్యు లక్కన । మాదనాదుల
ధీవిశేషుల । దివ్యమంత్రుల
నెలమిఁ బెంచిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౨ వరచళుక్య । నృపాలచంద్రుల
ప్రబలవైభవ । పత్తనం బయి
కలిమిఁ గురిసిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౩ బౌద్ధమతమును । బ్రబలపఱచుచు
నలుఁగెలంకుల । నరుల ధన్యుల
నిలను జేసిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౪ బౌద్ధకళలకు । బౌద్ధవిద్యకు
నిలయ మగుచును । నెగడియుండిన
లలితభూమిని । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౫ భక్తిరసమును । వసుధఁ జిలికిన
రామభక్తుని । రామదాసుని
జెలుఁగుతల్లిని । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౦ గానవిద్యకుఁ । గడలి యనఁగను
గ్రాలుత్యాగయ । కన్నతల్లిని
లలితమూర్తిని । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౧ సుకవయిత్రికి । సుదతిమిన్నకు
మొల్లదేవికి । ముద్దుతల్లిగఁ
గులుకుధన్యను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౨ భక్తహృదయము । పల్లవింపఁగఁ
గవిత లల్లిన । ఘనుని పోతన
కలమునడచిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౩ ముక్కుతిమ్మన । ముద్దుపలుకుల
తియ్యఁదనముల । తేనెసోనల
తేట లొలికిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౪ పసిఁడినిగ్గుల । నెసఁగుశైలికిఁ
బటిమఁగూర్చిన । భట్టుమూర్తిని
నెలమిఁ గాంచిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౫ విశ్వనీతుల । విపులకవితలఁ
దేట తెనుఁగులఁ । దిద్దితీర్చిన
దివ్యవేమన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౬ హాస్యరసమున । నారి తేరిన
రమ్యకవివరు । రామలింగని
ధీరమాతను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౭ కవిపితామహ । గణుతికెక్కిన
ముద్దుకైతల । పెద్దనార్యుని
కళల వెలిఁగిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౮ సుధను గురిసెడి । మధురకవితల
సొబఁగు లెఱిఁగిన । సూరనార్యుని
తెలివి కిరవగు । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౬౯ ప్రౌఢకావ్యపుఁ । బాకరసమున
దొప్పదోఁగుచు । నొప్పుధూర్జటి
నిలను సాకిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౦ పాలతీపియుఁ । బూలపొలుపును
కలిపి సులలిత । కవితలల్లిన
తిక్కనార్యుని । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౧ స్వేచ్ఛఁ జెలఁగుచుఁ । జెలువుఁ జిల్కెడి
జిలుఁగుకైతల । సిరులనాథుని
జెలిమిఁ బెంచిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౨ ద్విపదనడకల । తెగువుఁజూపు న
భంగకవినరు । రంగనాథుని
పలుకు లొలికిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౩ రామచరితము । రమ్యకవితల
వ్రాసి మించిన । భాస్కరాఖ్యుని
దిద్ది తీర్చిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౪ చారుపదయుత । సరసకవితల
వినుతిఁ గాంచుచు । వేంకటాఖ్యను
వెలుఁగుకవిమణి । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౨౫ కళలజిగిబిగిఁ । దెలియు కవిమణి
విబుధమూర్తిని । వీరభద్రునిఁ
గలిగి యెసఁగిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౬ ప్రౌఢకవితల । వ్రాసి కబ్బపుఁ
బడతిఁ దనిపిన । పాపరాజును
జెలిమిఁ బ్రోచిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౭ భావబంధుర । భవ్యకవితల
రవణఁ గుప్పిన । రామభద్రుని
పలుకువిరిసిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౮ కలముపోటున । గరువమందును
బెదరునెఱుఁగని । భీమకవి కిలఁ
గలిమిఁ గూర్చిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

౨౯ నన్నయాదుల । నెన్నశక్యము
గానిమంజుల । కవివతంసుల
తేజ మెగసిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా !

సీమ]

౧౦ శారదానన । చారుకాంతులు
చిత్రగతులను । జిందుఁద్రొక్కఁగఁ
జెలఁగియాడిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౧ కావ్యకన్యక । కవితరూపము
దిద్దనేర్చిన । ధీసమేతుల
తెలివి కిరవగు । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౨ వాఙ్మయంబును । వన్నెవన్నెల
తళుకు బెళుకులఁ । దనరఁజేసిన
తెలివిగనియగు । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౩ దేవవాణిని । దివ్యటీకల
నవ్యఘణతుల । నడపి రంజిలు
ధీరవిదుషిని । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౪ లలితకళలకుఁ । జెలువుఁదొడుగుచు
రసముఁ గూర్చుచు । రక్తిఁగొలిపిన
వెలఁదిమిన్నను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౮౫ నాట్యకళలకు । నవ్యరీతుల
మెఱుఁగుపెట్టిన । మేటితల్లిగ
వెలుఁగుపూజ్యను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౮౬ భరతశాస్త్రము । నిరతిశయముగ
వృద్ధిఁగాంచుచు । వివిధసరణుల
మొలకలెత్తిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౮౭ లలితగతులను । గలితకృతులను
గంఠమెత్తుచుఁ । గవులుపాడిన
చెలువమిన్నను । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౮౮ పుష్పవనములఁ । బ్రొద్దుఁబుచ్చుచుఁ
చైత్రశోభల । సతముఁ గులికెడి
తేటకబ్బపుఁ । దెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౮౯ దేశభాషలఁ । దెలుఁగులెస్సని
కృష్ణరాణ్మణి । కీర్తిసేయఁగఁ
బులకరించిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౦ శిల్పచాతురి । సిరులు కళలును
తత్త్వనైపుణి । తరుణశౌర్యము
నిలిచిపొదలిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౧ చిత్రకళలకుఁ । జేతిపనులకు
సకలవైభవ । సదనమగుచును
పాలుబారిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౨ నగ్నజిత్తుని । నవ్యశిల్పము
కళలుమెఱసిన । కర్మశాలగ
నలరియుండిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౩ విజయపురమున । వినుతవిబుధులు
కావ్యమూర్తులు । గండుజోదులు
కలిసియాడిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౪ కవితఁబెంచిన । ఘనులరాజుల
మతముఁబ్రోచిన । మాన్యతేజుల
దీప్తినందిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౫ కృష్ణభూపతి । ప్రీతిఁ బెఱుఁగుచు
నతులసంపద । లంది కీర్తుల
దివిని ముట్టిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౬ భవ్యచరితుల । వల్లభాదుల
మతము లెదిగిన । మందిరంబుగఁ
దేజరిల్లిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౭ శాలివాహన । శకమునడకలు
ఆంధ్రవిష్ణుని । యమరరచనలు
తొలకరించిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౮ తత్త్వజలనిధిఁ । దఱచివైచిన
విమలచరితుఁడు । వీరబ్రహ్మము
తెలిసిపాడిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౯౯ డచ్చివారికి । లచ్చినొసఁగుచు
మహిని వెలిఁగిన । మచిలిబందరు
కొలుచుతల్లిని । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦౦ ఘ్రాంసువారిని ౹ రాజ్యలోభుల
నాంగిలేయుల ౹ నాదరించిన
జాలిగడ్డను ౹ తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦౧ కృష్ణగౌతము ౹ లెలమిఁ బాఱుచు
పాడిపంటల౹పసలఁ బెంచఁగ
వెలుఁగుతల్లిని ౹ తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦౨ తుంగభద్రయ౹భంగగతులను
బొంగిపొరలుచుఁ ౹ బొగడుపదములఁ
గులుకుసాధ్విని ౹ తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦౩ సస్యతతులను ౹ శ్యామలంబయి
కనులపండువు ౹ గాఁగ ముదమును
జిలుకుదేవిని ౹ తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦౪ భాగ్యఖనియయి ౹ భవ్యపదమయి
వరలుమాతకు ౹ భరతభూమికిఁ
దిలకరూపిణి ౹ తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦౫ ఎంతపాడిన । నెంతపొగడిన
నంతుదొరకని । వింతపనులకుఁ
దెన్నుఁదీసిన । తెలుఁగుసీమను
జగతిఁ జాటర తమ్ముఁడా!

౧౦౬ దిక్కుదిక్కులు । పిక్కటిల్లఁగ
విశ్వజనులకు । విశదపడఁగను
దెలుఁగుఘనతను । దెలుపుఢక్కను
మ్రోగఁజేయర తమ్ముఁడా!

౧౦౭ నోటిమాటలఁ । గోటిరీతులఁ
బూర్వవీరుల । పుణ్యభూమిని
తెలుఁగుసీమను । దెలిసిపాడిన
ఫలము లేదుర తమ్ముఁడా!

౧౦౮ తెలుఁగురోషము । తెలుఁగుచేవయుఁ
దెలుఁగుతెగువయుఁ । దెలుఁగుబలిమియు
వెల్లివిరియఁగ । వీరధర్మము
తెలిసి నడవర తమ్ముఁడా!

౧౦౯ తెలుఁగు పౌరుష । దివ్యకాంతుల
దిక్కులన్నిఁట । ద్రిమ్మరించుచుఁ
గార్యశూరత । కడలుకొనఁగను
గదలి రమ్మిఁక తమ్ముఁడా!

౧౧౦ * * * *
* * * *
* * * *
* * * *

౧౧౧ తెలుఁగుసీమను । దేశమంతటఁ
జాటు టన్నను । జచ్చుచే యని
తెలిసి మాతకుఁ । దలను గాన్కగ
నిచ్చివేయర తమ్ముఁడా!

౧౧౨ ప్రాణభీతిని । మానహానికి
లొంగి మగటిమి । క్రుంగిపోవఁగ
దేశదాస్యముఁ । దీర్చనేరని
బ్రదుక దేలర తమ్ముఁడా!

౧౧౩ బ్రదుకు శాశ్వత।పదము గాదుర!
మానహీనులు । మహినిఁ గ్రిములను
బోలువా రని । బుద్ధి నెఱుఁగుచు
మేలు కాంచర తమ్ముఁడా!

౧౧౪ అరులబాధల । నణఁగి దీనతఁ
దల్లిదేశము । తల్లడిల్లుచు
గొల్లుగొల్లన । గోడుచేసిన
నిద్ర వీడవె తమ్ముఁడా!

౧౧౫ మాతృదేశము । మానహానికి
లొంగి దాసిగఁ । గ్రుంగిపోవుచు
నున్న వేళను । గన్నువిప్పవె?
ఎంతసిగ్గుర తమ్ముఁడా!

౧౧౬ గాంధిదేవుఁడు । కన్నతల్లినిఁ
గాచుకొఱకయి । ఘనతఁ గంకణ
ధారియగుచును । దరలుచున్నను
నిద్ర యేలర తమ్ముఁడా!

౧౧౭ * * * *
* * * *
* * * *
* * * *

౧౧౮ * * * *
* * * *
* * * *
* * * *

౧౧౯ విశ్వమంతట । వెలయు స్వేచ్ఛను
భరతభూమినిఁ । బ్రబలు బానిస
తనపుఁబాట్లను । గనుచునుండిన
సిగ్గు లేదుర తమ్ముఁడా!

సీమ]

౧౨౦ బానిసీంద్రికు । వసుధ గౌరవ
మెపుడు లే దని । యెఱిఁగియుండియు
దాస్యవారిధిఁ । దగిలి మునుఁగుట
సిగ్గుచేటుర తమ్ముఁడా !

౧౨౧ పూర్వపురుషుల । భూరికీర్తికి
మచ్చ గలుఁగఁగ । మందమతివయి
భాగ్యహీనత । బానిసీఁడుగ
నుండు టొప్పునె తమ్ముఁడా !

౧౨౨ * * * *
* * * *
* * * *
* * * *

౧౨౩ * * * *
* * * *
* * * *
* * * *

౧౨౪ * * * *
* * * *
* * * *
* * * *

౧౨౫ మాతృభూమియు । మాతృదేవియు
నిడుమలెన్నియొ । బడుచునుండగ
సుఖములందుచు । సౌఖ్యపుత్రుని
జన్మమేలర తమ్ముఁడా!

౧౨౬ తెలుఁగుబాలుఁడు । ధీరుఁ డను నుడి
దేశమంతటఁ । దెలియునట్లుగ
మాతృరక్షణ । మహితపూజకు
బలిగ నిల్వర తమ్ముఁడా!

౧౨౭ దేశరక్షణ । దివ్యచేష్టను
శౌర్యవంతుఁడు । చచ్చు టొదవిన
వానికీర్తులు । వసుధ మెండుగ
నిండి వెలుఁగుర తమ్ముఁడా!

౧౨౮ * * * *
* * * *
* * * *
* * * *

౧౨౯ * * * *
* * * *
* * * *
* * * *

౧౩౦ * * * *
* * * *
* * * *
* * * *

ఆ కాం క్ష .

తెలుఁగుపురుషులు । తెలుఁగుపడఁతులు
ధీరమతులయి । శూరవరులయి
మాతృదుఃఖము । మాన్పఁ బోరెడి
మేటిజోదులు గావలెన్.

"బౌద్ధవాఙ్మయబ్రహ్మ"
దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారిచే రచింపబడి
మానవాదర్శగ్రంథమండలివారిచే ప్రకటింపబడిన

# సర్వోత్తమ గ్రంథరాజములు.



## మానవజీవితము

**2146** పేజీలు. మూడు సంపుటములు. **3** సంపుటములలో మొత్తం 84 ప్రకరణములు గలవు. ఒక్కొక్క ప్రకరణమందు అనేక ఉపప్రకరణములు గలవు. ఒక్కొక్క సంపుటము రఫ్ స్టిఫ్ బైండింగు రు **3**-8-0 ఫుల్ క్యాలికో రు **4**-0-0.

ఇది తెలుగుభాషలో నేటివఱకు వెలువడియుండని యొక బ్రహ్మాండమగు నైతికగద్యగ్రంథరాజము.

"శీలమునుబోషించి పెంపొందించు గ్రంథములలో దీనికి సమానమైనది నాకు దెలిసినమట్టున కేభాషయందును లేదు. కాబట్టి ఈగ్రంథము నూతనసృష్టి."

—కట్టమంచి రామలింగారెడ్డి.

"వాస్తవమున ఈ గ్రంథమందలి విషయము, లక్ష్యము, పద్ధతి, శైలి ఒకదానికొకటి వన్నెవెట్టుచు ప్రశంసార్హములుగ నున్నవి." —సర్ యస్. రాధాకృష్ణన్.

"ఈ గ్రంథమందు మానవజీవితము సార్థకమగుటకు వలయుమార్గములు పూసగుచ్చినటుల సుబోధకముగ వివరింపబడినవి.
—ఆంధ్రపత్రికా సంపాదకీయము.

"ఇందులో ఎన్నో ఉన్నతాదర్శాలు వెలుగెత్తి వక్కాణింపబడి యున్నాయి. నీతిరహితమైన నేటిప్రపంచకానికీలాంటి గ్రంథ మెంతో అవసరం. ఈయుగమందలి యువకుల ప్రవర్తనను సంస్కరించడానికే వ్రాయబడింది ఈగ్రంథం. వయసుచెల్లినవారుకూడ ఈగ్రంథాన్ని చదివితే ఆత్మజ్ఞానవంతు లవుతారు."
—భారతి.

"ఈ గ్రంథమున విమర్శింపబూనని లోకవిషయము లరుదని చెప్పవచ్చును. ఏసంగతిగాని నిష్పాక్షికబుద్ధితోను, విశాలభావముతోను నిందు బరీక్షింపబడుచున్నది."
—రాయసం వెంకటశివుడు.

సూచన:— నేడే మానవజీవిత విషయసూచికపుస్తకము కార్డువ్రాసి తెప్పించుకొనుడు. దీనినిచదివిన మానవజీవిత ప్రాశస్త్యము తెలియగలదు.

# బుద్ధపురాణము

1400 పుటలు. ధర రు 4-0-0.

ఈ గ్రంథము ఆంధ్రసారస్వతములో కేవలము నూతనమును, మహోత్కృష్టమును నగు గద్యగ్రంథరాజము. ఈ

గ్రంథరాజమందు బుద్ధునిసమగ్రమగు జీవితచరిత్రయు, ఆమహనీయుని మతధర్మములును, ఆతనిదివ్యసుందరములగు బోధనలును విపులముగ, విశదముగ సులభమగు శైలిలో వ్రాయబడియున్నవి.

"బుద్ధుని జీవితమును, తన్మహనీయుని దివ్యప్రబోధములను ఆంధ్రప్రపంచమునకు సవిస్తరముగ నుపదేశింపదమ మహద్గ్రంథమే తొల్లింటిదని నేను విశ్వసించుచున్నాఁడను. బౌద్ధము నాస్తికము కాదను మీ వాదన నాకు మిక్కిలి నచ్చినది." —సర్ యస్. రాధాకృష్ణన్.

"ఆంగ్లభాషయందుగాని, ఆంధ్రమునగాని యింతటి విశాలదృష్టితో మహద్విచక్షణతో, కూలంకషముగ, సర్వతోముఖముగ బౌద్ధమతమునుగూర్చి రచింపబడినగ్రంథమును నేను కని విని యెఱుంగ." —కట్టమంచి రామలింగారెడ్డి.

"ఈ గ్రంథమందు అనేకబౌద్ధగ్రంథసారము ప్రదర్శింపబడినది." —పానుగంటి లక్ష్మీనరసింహారావు.

"బుద్ధదేవునిగూర్చినసర్వవిషయములీ గ్రంథమున గలవు." —చిలకమర్తి లక్ష్మీనరసింహము.

సూచన:—ప్రస్తుతము ఈగ్రంథము స్టాకులో లేదు. ఆంధ్రమహాజనుల విశేషాభిమానాదరణములవలన ప్రథమముద్రణ వేయిప్రతు లచిరకాలముననే అయిపోయినవి. ద్వితీయముద్రణను శీఘ్రముగానే వేయుదుము.

300 పుటలు **ఆత్మవిజయము** ధర రు 1-0-0

అనువాదకులు :

బౌద్ధవాఙ్మయబ్రహ్మ, దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారు.

ఇదియొక మహోత్కృష్టమగు నైతికగ్రంథము. ఇది "By ways of Blessedness" అను ఆంగ్లగ్రంథమునకు అనువాదము. ఇందు మానవుని యైహికాముష్మిక జీవితాభ్యుదయమునకు ముఖ్యసాధనములయిన పదునాలుగు విషయములు విపులముగ, విశదముగ సరళమైన శైలిలో వివరింపబడి యున్నవి.

70 పుటలు. **శ్రీకృష్ణవేణువు.** ధర. రు 0-4-0.

ఇది వాస్వానీపండితుని "Ancient Murali" అను ఆంగ్లగ్రంథమునకు అనువాదము. శైలి సరళము. భావములు గంభీరములు. ఇందు భగవద్గీతాతత్త్వము, ధర్మవ్యాసంగము గలవు.

400 పుటలు. **నిష్కామయోగము.** ధరస్వల్పము.

తృతీయముద్రణము. (గాంధిభగవద్గీతానువాదము) రు 0-6-0.

ఇది గాంధిగారి గుజరాతీ 'అనాసక్తి యోగము' నకే శుద్ధానువాదము. ఇందు మహాలము, మహాత్ముడు వ్రాసిన

యర్థము, వ్యాఖ్యానము గలదు. గీతారంభమున గీతపై మహాత్ముని 30 పుటలుగల సవిమర్శకమగు పీఠికయు గలదు. మహాత్ముని యీ గీతను ప్రతి ఆంధ్రుడును చదివి తీరవలయును. ఇక కొలదిప్రతులే గలవు.

100 పుటలు. **సర్వోదయము** ధర రు 0-2-0

ఈ గ్రంథము గుజరాతీలో మహాత్మునిచే రచింపబడినది. ఇందు సర్వసమానత్వము, సర్వమానవకల్యాణము బోధించబడినవి.

## దండియాత్రాప్రవచనములు

130 పుటలు. ధర రు 0-3-0.

ఇందు మహాత్ముడు ఉప్పుసత్యాగ్రహముకొఱకు దండికి బయలుదేఱినపుడు సబర్మతినుండి దండి చేరువఱకు మార్గమధ్యమున గావించిన అమూల్యములగు ఉపన్యాసములు కలవు.

